౩. పాల్కడలికి ముద్దుల ♦ పట్టి యనివ
సిరులనిచ్చెడు చెలువ సో ♦ దరుఁ డఁటన్నఁ
దేజుచే గువలయ మేలు ♦ రాజఁటన్నఁ
జందమామకుఁ డీటురా ♦ దందు మేము.

౪. ఉగ్గుపాలను ద్రాగుచు ♦ నున్నయప్పుడె
తల్లిచే విన్నదగుట జా ♦ బిల్లిపదము

4

చందమామకు నీవను, ♦ నెంగు నొక్కి
మామకు జాబిల్లి యనఁ జంద ♦ మామను యనిన.

5 శశధరుం డన్న నీచోక్తి, ♦ జలజవైరి
యన్న శ్లేషోక్తి, తెల్పు ♦ శాయుం డన్న,
నీవకకు మామకు నీవిలోఁ ♦ జందమామ
యనియు, జాబిల్లి యనియు నే ♦ ముందు మెపుకు

ఆపనియు, నీపనియుఁ జేయ ♦ నక్షత్ర
దినము గడచెను; రాత్రి యే ♦ తెంచె నక్షత్ర
మిన్ను నీలపటంబు నాఁ ♦ జెన్ను మీఱెఁ
జలువలనుజిమ్ము పున్నమ ♦ చందమామ
నిండుకళల విరాజిల్లు ♦ చుండెఁ; జుక్క
లొక్కటొక్కటిగాఁ దోఁచు ♦ చుండెఁ; గనుల

పండువుగఁ బండువెన్నెల ♦ నిండియుండె;
నఖిలజగము సుధామయ ♦ మైనయట్లు.

8. మెల్లమెల్లగ మలయస ♦ మీరణుండు
తలిరుగొమ్మల మీఁదుగాఁ ♦ దాఁకుచుండె;
నేచిపురుగొమ్మ నుండెనో ♦ యెవరి కెఱుక!
కోయని వసంతకోకిల ♦ కూయుచుండె.

9. వేడుకలఁ గూర్చుచల్లని ♦ వెన్నెలలను,
హాయినొసఁగూర్చు మందమం ♦ దానిలముల,
లలితగతి మీరుకోకిలా ♦ లాపములను,
గోరక చరించువార లు ♦ న్నారె జగతి?

10. అరుబైట వెన్నెలకుప్ప ♦ లాడువారు,
కోకిలమతంబులకు మారు ♦ గూయువారు

కల్లపాదులఁ గల్పించి ♦ కాయఁజేసి
గుమ్మడులఁ జిక్కుడులఁ జాలఁ ♦ గోయువారు;
తత్తరంబున వెన్నెల ♦ వత్తి విడి
తెచ్చి యిచ్చినవారల ♦ మెచ్చువారు;
చిట్టిమిరియంబులును, ♦ జిప్పచిప్పగోళ్లు
చెమ్మచెక్కలు నాడిహా ♦ సించువారు;

12 నగుచు లికి లాపేళ ♦ నగుచు నగుచు
నిరుజోడుగ నాటల ♦ నాడికొనిరి;
తార యీబాలికలతోడ ♦ జేరియుండి;
నీమ ముద్దులచెల్లెలై ♦ దోడ్ల లలిత
13 "అక్క నన్నేల గొనిపోవ ♦ దయ్యె", ననుచు
పిఱిగున్నముదారక వై ♦ నొంటఁ దవిలి,

కనుమొఱంగినసోదరిఁ ♦ గానలేక
వెనుదిరిగి తల్లికడ కేగి ♦ వెక్కి-వెక్కి
మొన్న చెప్పిన వినకుండ ♦ ఏడ్చుచుండఁ
పోరుపెట్టినబాలిక ♦ బుజ్జగించి
లీల యొక్క పైఁడిగిన్నెలోఁ ♦ పాలు పోసి
గుజ్జుబువ్వను గలిపి యాఁ ♦ కూఁతునెత్తి

15 చంక నిడికొని వాఁకిటఁ జాదమామఁ
జూపి "మాతల్లి! జాబిల్లిఁ జూచినావె!
అమ్మ బువ్వకుఁ బిలిచిన ♦ యంతలోన
పరుగుపరుగునఁ జెంతకు ♦ నరుగుదెంచు.

16 తగవుపెట్టక బంగారు ♦ తండ్రిలాగు
బొజ్జనిండఁగఁ దిని యాడఁ బోవునమ్మ!

తల్లితో మారమును సేయ । వెల్లవేళ
వల్లరులఁ జేయు కాటల ॥ నాడుచుందు,

17. మంకుపిల్లలఁ గూడఁదు; ॥ మంచివారఁ
బుద్ధిమంతులు కొంతఁ ॥ గొప్పచేయుదు;
చల్లఁదన మిచ్చు; వెన్నెలఁ ॥ జాలఁ దెచ్చు;
నేను నాతల్లి! నినుఁ జూచి ॥ నాఁడి తెందు.

పైఁడిగిన్నియలో నున్న పాలబువ్వ
నించు కించుకగా నార । గించుమాఁడె—
"అమ్మరో! గిన్నెలోనిది యయ్యొ; నాదు
కడుపులో నున్నదల్లని ♦ కాకిపిల్ల
పొట్ట నిండంగఁ దిని పోయె ♦ బువ్వ యొల్లఁ;
బలుకుచున్నది చల్లఁ ♦ బాలు ద్రావి.

21 నేల నొకచుక్క మైనను ♦ రాలకుండఁ
ద్రాగితిని పాలు బంగారు ♦ తల్లిలాగు;
తల్లి! జాబిల్లి యల్లరి ♦ పిల్లవాఁడు;
బువ్వ! నేరితిగా నెల్లఁ ♦ బోసికొనను?
22 నేఁగ నాబువ్వఁ దిని పోవ్వఁ ♦ వేసినాను
చందమామపై; నోయమ్మ! ♦ ముందు నాను

కడుపులోఁ గాకిపిల్లవే ♦ గంతులైచెఁ;
కలదుగాఁబోలు నీలిని ♦ కడుపులోనఁ
23 చిన్నదగుకాకిపిల్ల; లే ♦ కున్న నతని
యొడలిలో నల్పుగాన్పించు ♦ చున్న దేమి?
అమ్మ! యీచిన్నిబాలి ♦ కమ్మ యెవరు?
ఈలిసకి బువ్వపెట్టువా ♦ రెవ్వరమ్మ!

24 అర్త్రు నాకంటె నీతని । కర్త్రు గలదె?
ఇతనితో నాకుకొనకుండ । నెవరి కేమి?
పోరువెట్టఁడె కొంతపైఁ । బోవలేక?
భయము వేయదె క్రిందికిఁ । బడను యేమొ?

25 రాత్రిరైనను నింటికి । రాక బయలఁ
డెల్లవారినదాఁకను దిరుగు నేమి?

ఎవరుపిల్చిన వారితో ♦ నేఁగి వారి
తోడఁ గూర్చుండి మొంగిల ♦ కూడు దినునె!,,
౨౦ అనుచు నవ్యక్తమధురోక్తు ♦ లాడుచుండ
జనని ప్రియమొంది లలిత న ♦ ర్మ్యాన గదించి
చల్లగా నుత్తరంబులో ♦ సాగుచుండ
నాడఁబోయిన తారయు ♦ నరుగుదెంచె.

27. తారహృదయంబు మెత్తన; ◆ తార కెపుడు
జందమామను జూచుట ◆ చాల ప్రీతి;
పగలు జాబిల్లి రాక యే ◆ మగును గాని
తారయును మింటిపైఁ జూడ్కిఁ ◆ దేరనీదు.

28 ఎపుడు సూర్యుఁడు గ్రుంకునో? ◆ యెపుడు గోవు
లిండ్లకయి వచ్చుచుండునో? ◆ యెపుడు పసుల

తెల్ల గూండ్లను జేసునో? ♦ యెప్పుడు మింట
నెత్తిగాం దోంచుచుండునో, ♦ యెప్పుడు కేంగు
29 యరుగుదెంచును, తారయు ♦ నవ్వి పువ్వు
చందమామను జూచెను ♦ పగ్గభానువున
నింగి నిరువంకలను దొంగి ♦ తొంగి చూచెం;
వెన్నెలబయళ్లలో నాట ♦ లన్ని నామి

30 కొంతయో శ్రీగావ్యన ♦ నెపుకు చాడ
మామరాకయె గోరు నె ♦ మ్మనమునందు
కోటి తనయూడువాటిగో ♦ జటి తాగ
యామకోను: జందమాను యు ♦ స్వప్ని నాష్టి

31. పంజచీకటిరాత్రులం ♦ జాదమాను
రాకం గోరుచు నామి త ♦ దేకదృష్టి

రమ్యతరమైన నీలాంబ  రంబునందు
చల్లగాఁ గూరుచున్నాఁడు ♦ చందమామ.
పొంకపునెలవాఁ డొసంగిన ♦ పోగులెల్ల
నెత్తికొని వెండిపూఁతఁబూ ♦ యుంచె నేమొ
చందమామకు నునువెండి ♦ జాలు రంగు;
వత్తు లరమోడ్చి కనుఁగొనుఁ ♦ పల్లెయువిగా!

36. బాలికామణుల్ వెన్నెల ♦ వత్తు లనియుఁ
ప్రౌఢలగు సుందరులు వెల ♦ వాక లనియు
వనితలందఱుఁ జందురు ♦ వంక లనియు
ననెదరవి చందమామఁ బ ♦ ట్రెవికావె?
37. వరిగఁ బదియేనుదినములు ♦ చందమామ
క్రమముగా సంజకే వచ్చుఁ ♦ గాని, వెనుక

నొకట నాలస్యముగ వచ్చు ♦ చూడి యుండి
యేము నిద్రించుదాఁక రాఁ ♦ డేమొ తుదకు?

౩౮. ఆఁడుబిడ్డ లొప్పులకుప్ప ♦ లాడు వేళ
గల్లుగల్లనునద్దాల ♦ గాజులందు
నిలిచి కన్నుల మిరుమిట్లు ♦ గొలుపుచుండు
చందమామకు నది యేమి ♦ సంబరంబా?

39. ఆటసందడిలో నున్న ♦ యట్టివేళ
చెట్లకొమ్మలసందుల ♦ చెంతఁజేరి
ఆకినచిగుళ్లలో మంచు ♦ నీరు వ్రాసి
యెన్నియోముత్తియములఁ గా ♦ యించుచుందు.

40. ఆటలో నోడిపోయిన ♦ యట్టివారిఁ
దెల్లవోయినవారంచు ♦ దెప్పఁబోవ

చిన్ని వెన్నెల నెల్లరఁ ♦ జిన్నబుచ్చి
తెల్ల వ్రాయినవారలఁ ♦ దెలియనీఁడు.

41. కొండపై నెన్ని చుక్కలో ♦ నిండియుండ
దినమునకు నొక్క చుక్కతోఁ ♦ దిరుగుఁగాని
" యాడుకొనరారు! జాబిల్లి!" ♦ యనుచుఁ బిల్ల
లెంత పిలిచిన దిగిరాఁడ ♦ దేమి భయమొ?

42\. సరిగ తేఁజిగురాకుల ♦ సందులందు
నెన్నియో వెండిపూలఁ బూ ♦ యించుచుండెఁ
గనులలపి చూడ మింటికిఁ ♦ గంటి కొఁకపు
వెండితీఁగ లెన్నెన్ని క ♦ ల్పించుచుండు.

43\. అంటగా ముట్టగా రాని ♦ యట్టిచోట
నిలిచి దాఁగిలిమూఁతల ♦ నెఱపుఁ గాని,

ఈమజ్జోడైనవారితో ♦ నాడుకొనఁగ
జతలుగూడ డిదేమొకో ♦ చందమామ.

44. ఒక్కమాటుగఁ దెరచాటు ♦ నుండివచ్చు
భామవేషంబువలె మబ్బు ♦ ప్రక్కనుండి
చటుకుమని వచ్చుచుందు ♦ చందమామ
యీతనికి నింతమొయ్యార ♦ మెందుకొ అణా?

45. చందమామ యదేమొ కా • సారవారి
పూరములలోన మాటికిఁ • దాఁగుచుండు?
మఱచితిమి కవితావేశ • పరవశతను
కలదుగా యట వలపించు • కలువకన్నె!

46. తుమ్మెదలఁ గాంచి గీతమా • ధుర్యమెంచు
మల్లెపూవులఁ గలపరి • మళముఁ గాంచు

వాయునందనుఁ డోఁ జేసు ♦ చేయిఁ గలపు
సరసనుకుమారంబలుఁకు ♦ మాచందమామ!

47. నింకుగా నెక్కువాఁడు గా ♦ న్పించినంత
నెవఁదుష్టులు తాఁకునో ♦ యేమొకాని
నాఁటినాఁటికిఁ గృశియించి ♦ పాటదప్పి
తిరిగి నెలనాళ్ళదాఁకను ♦ తేరుకొనఁడు.

48. ఎలమి నంతఃపురంబుల ♦ కెగయఁ బ్రాఁకి
ముంగిటి గవాక్షములఁ దొంగి ♦ తొంగి చూచుఁ
దేరి చూచిన మిన్నెక్కి ♦ కూరుచుండుఁ
దుందుడుకు బాలకుఁడు గాఁడె ♦ చందమామ.

49. లలితకరకిరణముల జా ♦ లంబు లల్లుఁ,
దోయనిధివీచికలలోనఁ ♦ దూఁగి యాడు

మబ్బుటోడలపై నెక్కి ♦ మాయ నగును
జాలకుల చెల్మిఁగన నేము ♦ చందమామ.
చందమామనుగను కొంత ♦ సంబరంబొ
సలిలకలశంబు చెప్పఁగాఁ ♦ జాలకున్నఁ
బాసఁగనినమాత్ర నుప్పొంగి ♦ పోవుచున్న
కలశవారాశిఁ గనియైనఁ ♦ దెలిసికొనుఁడు.

51] తెల్లనగుకాగితముమీఁద ♦ దిరిగితిరిగి
కలము గంతులువేయంగఁ ♦ గలదుగాని
నల్లనగునింగి నల్లన ♦ నడచుచున్న
చందమామను వ్రాసి మె ♦ ప్పొందఁగలదె?



